శ్రీ

# భక్తినిగురించి

తెనాలి సంస్కృత కాలేజీలో

బ్ర॥ శ్రీ॥ బల్లమూడి గురుమూర్తి శాస్త్రిగారు

లేక రఘునాధ శాస్త్రిగారిచే

సంస్కృతాంధ్రభాషలలో జెప్పబడిన

# ఉపన్యాసములు.

తెనాలి నివాసియగు పిల్లలమఱ్ఱి నారాయణమూర్తిగారి

ధనసాహాయ్యముచే

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే ముద్రింపబడియె.

1916. సం॥

వేదాంతాచార్యపాదాబ్జ రజఃకణశిరోమణిః
నకరోమిత్రపాంకించి త్తత్కృపాకింననిర్వహేత్ ॥ ఇతి

జ్ఞాఅవబోధన ఇత్యుపదేశాదవ బోధసామాన్యం జ్ఞానశబ్దార్థః - తద్ద్వివిధం - లౌకికవస్తువిషయం - అలౌకికవస్తువిషయంచేతి - లౌకికంచవస్తుద్వివిధం - ఐహికమాముష్మికంచేతి - తత్రాద్యం ఘటపటాది సర్వానుభూతం - ద్వితీయంతు కర్మఫలభూతం ధూమాదిమార్గగమ్యం పితృలోకాది - అలౌకికమపిద్వివిధం - సవిశేషబ్రహ్మరూపం - నిర్విశేషబ్రహ్మరూపమితి . తత్ర సవిశేషబ్రహ్మప్రాప్తిసాధనం భక్త్యాదికం - సాచభక్తిస్త్రివిధా - బాహ్యభక్తి రనన్యభక్తి రేకాంతభక్తిశ్చేత్యుపాసకానాం మతే-అద్వయబ్రహ్మవిన్మతేతు శమాదిసహకృతశ్రవణమననదిధ్యాసన కదంబః - ఏవంచ యత్సవిశేషబ్రహ్మప్రాప్తిసాధనం తదేవవిద్యాత్మతా మాపన్నం సన్నిర్విశేష బ్రహ్మాత్మ



తామస్య ప్రకటయ్యస్వయమపి తత్రోపశాంతం భవతీత్యుపనిషదస్సిద్ధాంతః - ఏతావతాప్రబంధేన భక్తిస్సవిశేషం ప్రాపయతి నిర్విశేషం చ ప్రకటయతీతి సర్వజ్ఞ సర్వపూర్వాచార్యసమ్మతోయమర్థ ఇతి స్ఫుటీకృతంభవతి- తత్రభక్తిస్వరూపం కిం- కథం తత్రభక్తిరాధాతవ్యా- భగవానపి భక్తిగమ్యః కథంభవేత్ - కిం తత్రోదాహరణమిత్యాది సర్వమత్రవిచార్యం - భక్తిరితిభజసేవాయామితి ధాతోరిదంరూపం - ప్రకృతేసాచభక్తిః భగవత్సంబంధినీ సేవాదైహికీమానసీ చేత్యుభయవిధా ఉపాసకాభిమత పూర్వోక్తత్రితయాత్మికాచ - తథాచ శ్రీభాగవతే ప్రహ్లాదచరిత్రే ॥

శ్రవణంకీర్తనంవిష్ణో స్స్మరణంపాదసేవనం
అర్చనంవందనందాస్యం సఖ్యమాత్మనివేదనం॥

ఇతిపుంసార్పితావిష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా
క్రియతేభగవత్యద్ధాత న్మన్యేధీతముత్తమం ॥

ఇత్యాది - అస్యార్థః - విష్ణోశ్శ్రవణం - విష్ణోఃకీర్తనం - విష్ణోరితి తత్సంబంధ కథోపలక్షకం - ఏవంచవిష్ణుకథాశ్రవణం - విష్ణుకథాసంకీర్తనమితి ద్వైహిక్యా బాహ్యాభక్తేః ప్రకారభేదః - విష్ణోరితిసర్వత్రాన్వేతి - విష్ణోస్స్మరణమిత్యనన్యైకాంత భక్త్యోరుపలక్షణం - అనన్య భక్తిర్నామ - నాస్త్యన్యోభగవతో విషయో అస్యామితి అనన్యా - సాచసాభక్తిః - భగవదన్యావిషయిణీ మనోవృత్తిః - భగవదేకతానేతితాత్పర్యం - తథాచ - భక్త్యాత్వనన్యయాశక్యః - ఇతి భగవదుపదిష్టైకాదశాధ్యాయగత శ్లోకస్య వివరణే - అనన్యయా - అపృథగ్భూతయా - భగవతోన్యత్రపృథఙ్నకదాచిదపియా భవతిసాత్వనన్యాభక్తిరితి భగవద్భాష్యకారోక్తేః - ఏకాంతభక్తిర్నియతభక్తిః - నైయ





త్యంచభక్తే గర్భవతిస్వరూపవిలయః - యత్రసత్యంనకించనధ్యాతృధ్యానధ్యేయ భేదవిభిన్నం వస్తుప్రతీయేత తాదృశీచిత్తవృత్తిః - బ్రహ్మభేదోపలక్షితేతియావత్ - సైషాజీవన్ముక్తమూర్ధన్యానుభూయమానస్య బ్రహ్మానందస్య పరమాకాష్ఠేత్యద్వయ బ్రహ్మవిదామాశయః - భగవతి భక్తచిత్తవృత్తిప్రవిలయ ఏవభక్తేరైకాంత్యమితి సకలోపాసకవతంస సమ్మతం - విష్ణోస్తత్ప్రతికృతి భూతస్యార్చావిగ్రహస్యేతి యావత్ - పాదసేవనం - పరిచర్యా - అర్చనం - పూజా - వందనం - నమస్కారః - దాస్యం కర్మార్పణం - సఖ్యం మైత్రం - తన్మిత్రం యత్రవిశ్వాసఇత్యుక్తేః - ఆత్మనివేదనం - దేహసమర్పణం - భగవతే శరీరమర్పయిత్వా విక్రీతగవాశ్వాదావివ పునస్తద్భరణాదిచింతాత్యాగఇతి సర్వమేతద్భక్తేస్తదాధానస్యచ విధా భేదవిలసితం స్వరూపం - విష్ణోఃపాదసేవనమిత్యాదినా భగవద్విగ్రహారాధనాదిక మపిత

6

ద్ధ్యానమివ భక్తోద్ధరణధురీణ మితిశాస్త్రతాత్పర్యం ప్రకటితంభవతి - ఏతేనవిగ్రహారాధనం నసాధీయ ఇత్యాధునిక నాగరిక జనాభిప్రాయో నిరస్తః - కించ భగవతి భక్తిభావేనార్పితం మనోయద్ధోద్ధరణధురీణం తద్వత్తత్రికామక్రోధాద్యైరవ్యావిష్టం మనఇతి

గోప్యఃకామాద్భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయోనృపాః
సంబంధాద్వృష్ణయస్స్నేహా ద్యూయంభక్త్యావయంనృప ॥

ఇత్యాదినా శ్రీభాగవతే సప్తమేప్రకటితం - అపిచ తత్రైవషష్ఠే॥

సాంకేత్యంపారిహాస్యంవా స్తోభంహేళనమేవవా
వైకుంఠనామగ్రహణ మశేషాఘహరంవిదుః ॥

పతితస్ఖలితోభగ్న స్సందష్ట స్తప్తఆహతః
హరిరిత్యవశేనాహ పుమాన్నార్హతియాతనాం ॥

7

ఇత్యాదినా విష్ణుకింకరోక్తైః - కించనిరభిసంధికృతం కర్మాపి శాస్త్రీయం సత్త్వశుద్ధిసంపాదనద్వారా భగవంతమాత్మసాత్కరిష్యతి॥

యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః

ఇత్యాదినా గీతా తృతీయే భగవదుపదేశాత్ - తథాచ ఏతావతి పూర్వోక్తే సర్వస్మిన్ భక్త్యాదికారణకలాపే భగవత్ప్రసాదసంపాదన ద్వారా సంసారోద్ధరణధురీణే కిముపకర్తవ్య మాగమాచార్యోపదేశ ముఖాదనుక్షణమాత్మక్షిపృష్టసూణా స్సమాధౌసంయమిక్షితిస్తైః స్సాక్షాత్కారస్తస్య విద్యాలక్షణ శ్చిదానందమయ స్సమూలం తదుచ్ఛేదవిచక్షణఇతి - తథాచ శ్రుతిః -

తమాత్మస్థంయేనుపశ్యంతి ధీరాస్తేషాంసుఖం
శాశ్వతంనేతరేషామితి ॥

జ్ఞానప్రసాదేనవిశుద్ధసత్త్వస్తతస్తుతంపశ్యతే
నిష్కలం ధ్యాయమానఇతిచ ॥
యంవినిద్రాజితశ్వాసా స్సంతుష్టాస్సంయతేంద్రియాః
జ్యోతిఃపశ్యంతియుంజానా స్తస్మైయోగాత్మనేనమ ఇతి
యోగినస్తంప్రపశ్యంతి భగవంతంసనాతనమితిచస్మృతేః ॥

ఏవంచభక్త్యాది బ్రహ్మసాక్షాత్కారపర్యంతసాధనకదంబః శ్రుతి స్మృతిబ్రహ్మసూత్రతద్భాష్యాది ప్రామాణిక సర్వపూర్వగ్రంథసంప్ర తిపన్నః - తథాచ శ్రుతయస్స్మృతయశ్చదర్శితాః - సూత్రాదికంతు ప్రదర్శయిష్యతె - తృతీయెఅధ్యాయె ద్వితీయేపాదే ॥

అపిసంరాధనేప్రత్యక్షానుమానాభ్యాం

అస్యార్థః - అపి - కింతు - సంరాధనే - ఆగమాచార్యోపదేశ సంస్కృతే మనసీత్యర్థః - పశ్యంతియోగినః -



దృశ్యతేత్వగ్ర్యయాబుద్ధ్యా
ఏషోఽణురాత్మాచేతసా వేదితవ్యఇతిచశాస్త్రాత్ - ప్రత్యక్షానుమా నాభ్యాం - శ్రుతిస్మృతిభ్యాం - తత్రశ్రుతిస్మృతీ ప్రమాణమితి తాత్ప ర్యం - అత్రభగవత్పాదభాష్యం-

అపిచైనమాత్మానం నిరస్తసమస్తప్రపంచమవ్యక్తం
సంరాధనకాలే పశ్యంతియోగినః సంరాధనంభ
క్తిధ్యానప్రణిధానాద్యనుష్ఠానం • ఇతి -

కించ తత్రైవద్వితీయే అధ్యాయేద్వితీయే పాదే పాంచరాత్రమత పరీక్షాయాం - ఉత్పత్త్యసంభవాత్ - ఇతి సూత్రవివరణే-

యదపితస్యభగవతః అభిగమనాదిలక్షణ
మారాధనంతదపినప్రతిషిధ్యతే శ్రుతిస్మృత్యో
రీశ్వరప్రణిధానస్య ప్రసిద్ధత్వాత్ ఇతిభగవత్పాదాః

కించ ప్రథమపేవజిజ్ఞాసాసూత్రవివరణే-

అస్తితావన్నిత్యశుద్ధ బుద్ధముక్తస్వభావం
సర్వజ్ఞంసర్వశక్తిసమన్వితం బ్రహ్మ - బ్రహ్మశబ్ద
స్యహివ్యుత్పాద్యమానస్య నిత్యశుద్ధత్వాదయోర్థాః
ప్రతీయంతే - బృహ తేర్ధాతోరర్థానుగమాత్ -

ఇతిగ్రంథేన బ్రహ్మపదం నిర్విశేషసవిశేషోభయపరతయా సమన్వితంకించతత్రైవ - అంతస్తద్ధర్మోపదేశాత్ - ఇతిసూత్రవివరణే

స్యాత్పరమేశ్వరస్యాపి ఇచ్ఛావశాన్మాయా
మయంరూపంసాథకానుగ్రహార్థం
మాయాహ్యేషామయాసృష్టా యన్మాంపశ్యసినారద
సర్వభూతగుణైర్యుక్తం మైవమాంజ్ఞాతుమర్హసీతిస్మరణాత్॥



ఇత్యాదినా సవిశేషం బ్రహ్మాభ్యుపగతం - కించాత్రైవభాష్యటీకావివరణే భగవద్వేదాంతకల్పతరుకారాః -

నిర్విశేషంపరంబ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః
యేమందాస్తేనుకంప్యంతే సవిశేషనిరూపణైః ॥
వశీకృతేమనస్యేషాం సగుణబ్రహ్మశీలనాత్
తదేవావిర్భవేత్సాక్షా దపేతోపాధికల్పనం ॥

ఇత్యుదాజహ్రుః - ఏవమేవతత్రతత్రభాష్యే భగవత్పాదీయే సవిశేషబ్రహ్మాభ్యుపగమే తత్సాక్షాత్కారసాధన భక్త్యాద్యభ్యుపగమేచ విస్పష్టముపలభ్యమానే భగవాన్ భాష్యకారో భాగవతాగ్రగణ్యమూర్ధన్యమణి రితినిర్విచికిత్సమాబాలగోపాలం వక్తవ్యే కేచిదాధునికాభినవబ్రహ్మవిద్వదనుకారాః - నాయమాత్మేతి భాష్యే భగవంతముపాస్యం బ్రహ్మస్వవదద్భక్తి మపి భాగవతీం నాన్వకరోదిత్యా

యద్యదూచుస్తత్తత్తదీయ భాష్యాపరిజ్ఞాన విలసితంభవె దనాద్యవి ద్యావిజృంభితం వా సా, ద్వాంసో విదాంకుర్వంతు.

తతస్సర్వథా సర్వైరప్యాస్తిక మహాశయైర్యథాశాస్త్రం యథో ద్దేశం యథాశక్తిచస్యోద్ధరణప్రయత్నే ప్రమాదోన కర్తవ్య ఇత్య భ్యర్థ్యతే॥

తెనాలిపురవాసీ,
బండ్లమూడి గురుమూర్తి శాస్త్రి.

శ్రీః

సభ్యులారా! దయతో నామనవి నాలకింపుడు. యీసభలోనుండు కొందరిచే జ్ఞానవిషయమైన ఉపన్యాసములో ప్రేరేపింపబడి నేను శాస్త్రీయ నిశ్చయములో బాలుడనైనను సర్వజ్ఞవిద్వన్మణులచే నిర్వహింపనగు నీకార్యములో యత్నించుచు నస్మద్వేదాంతాచార్య పదపంకజపరాగలేశమును శిరసావహించుచు సజ్జనకృపామహత్వము దేనిని నిర్వహించదను ధైర్యముతో శుకము జెప్పినట్లు కొన్నిమాటలం జెప్పదలంచుచు కొంచెమైనను లజ్జనొందకున్నాను.

జ్ఞాఅవబోధనే అని పాణిన్యాచార్యులు చెప్పియున్నారు గనుక జ్ఞానమనగా సామాన్యముగా తెలివియని యర్థమగుచున్నది. అట్టి తెలివి లోకసిద్ధవస్తువులను గురించి కలుగునది. శాస్త్రసిద్ధ వస్తువులను గు

రించి కలుగునది. అని రెండు తరగతులు గలది. ఇందులో మొదటి దానిని గురించి అందరికిని వెల్లడిగా తెలిసియున్నదే గనుక వివరింపనక్కరలేదు. యింక రెండవదానిని గురించి వివరణమావశ్యకమే గనుక ముచ్చటించెదము. శాస్త్రసిద్ధమయినవస్తువుకు ఆముష్మికమని పేరుదీనిన తీంద్రియమనిగూడ శాస్త్రజ్ఞులందురు. అట్టి ఆముష్మికముకర్మఫలమనియు కర్మఫలభోజయితయగు భగవంతుడనియుద్వివిధముగనిర్దేశింపబడియున్నది. శాస్త్రజ్ఞులలో నేమరికొందరౌపనిషద్బ్రహ్మజ్ఞులగువారు ఆముష్మికమననెక కర్మఫలమే. భగవంతుడో ఐహికాముష్మిక కర్మఫలభోజయిత, ఏతదుభయవిలక్షణుండు స్వతో నిర్విశేషుండనియు నందురు. యిందు మొదటిది సుకర్మఫలమనియు దుష్కర్మఫలమనియు విభజింపబడియున్నది. అందు సుకర్మఫలము పితృదేవలోకవాసముచే ననుభవింపదగినదియు దుష్కర్మ ఫలము నరకలోకవాసముచే ననుభవింపతగినది



యు నని చెప్పెదరు. యిదియునుంగాక యిట్టిసుకర్మ దుష్కర్మలు పూర్వోక్త పరలోకఫలము ననుభవింపజేయుటకు తగినవి గాకున్నయెడల సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు ఆకర్మకర్తలకు కర్మానుసారముగ మనుష్యతిర్యగాది శరీరముల నిచ్చి యీలోకంబుననే సుఖదుఃఖంబుల ననుభవింపజేయుననియుం జెప్పెదరు. గనుక విచారించగా తేలిన శాస్త్రసిద్ధాంతమేమనగా కర్మఫలమెద్దియైనను జననమరణ ప్రవాహముచే నిరంతరము నడదెగకున్న సంసార సముద్రమున నోలలాడించుచు వీనికి విశ్రాంతి కలుగజేయకుండును. గనుక దానిని కోరువాడు భగవంతుని దయను సంపాదించుకొరకు ప్రయత్నించవలెనుగదా అట్టి భగవత్కృపా సంపాదనోపాయముల నాలోచింపగా నందులో మొదటిది (అనగా సులభోపాయము) నిష్కామ కర్మానుష్ఠానము. రెండవది భక్త్యాదికము. మూడవది అపరోక్షజ్ఞానము (అనగా బ్రహ్మసాక్షాత్కారమనుట) అని

యు సర్వజ్ఞులగు పూర్వాచార్యులు వక్కాణించియున్నారు. యిందు నిష్కామకర్మానుష్ఠానమనగా కర్మఫలము ననుభవించు కోరికలేకనే శాస్త్రమునందు ఆయావర్ణాశ్రమముల ననుసరించి కర్మల నాచరించవలసినట్లు జెప్పియున్నందున యిక్కర్మలం జేయుట విధివిహితము. యిందుల ఫలమీశ్వర ప్రీతిగనుండుగాక. అన్ని యెంచుకొని అధికారి ఆయా శాస్త్రోక్త కర్మలంజేయుట. యిట్టి నిష్కామకర్మానుష్ఠానము చిత్తశుద్ధిని గలిగించుచు బ్రహ్మవిద్యకును పాయమగునని శాస్త్రసిద్ధాంతము. పైనజెప్పిన మాటిలోనిది సులభోపాయమని యెందుకు జెప్పినామంటే (పరాంచిఖానివ్యతృణత్స్వయంభూ స్తస్మాత్ప రాఙ్పశ్యతినాంతరాత్మన్) అని కఠ శ్రుతివున్నది. అనగా దీనికి అర్థము. స్వయంభూః పరమేశ్వరుడు ఖాని శ్రోత్రాదీంద్రియములను, పరాంచి, పరాఙ్ముఖములనుగా సృజించి (అనగా నాత్మాభిముఖములనుగాక బాహ్యవిషయాభిముఖములను



గాననుట) వ్యతృణత్- హింసించెను- తస్మాత్ అందువలన (ప్రతిపురుషుడు) పరాఙ్పశ్యతి బాహ్యవిషయములను తెలుసుకొనుచున్నవాడె- నాంతరాత్మన్- అంతరాత్మను తెలిసికొనువాడు కాడు- అని గనుక సర్వదా ప్రతిపురుషుడున్నూ స్వభావముచేతనే బాహ్యవిషయానుభవమునందే సంప్రవిష్ట మనస్కుడుగనున్నవాడు- గనుక (మూర్ఖంఛందానుగోధేన) మూర్ఖుని వానిస్వభావము ననుసరించియే మంచిమార్గమునకు మరలించవలెగాన ప్రథమమునుంచియు వానిచే నభ్యసింపబడుచుండు కర్మల ననుష్ఠింపజేయుచు అందులో కొంచెము మామూలుకు మార్పుజేసి జెప్పుచు అనగా- యిందుల లాభమును మాత్రము నీవు గోరకుండుము. ఈశ్వరుని కర్పించిన నతను మిక్కిలి సంతసించి శాశ్వతఫలము నిచ్చును. అని ప్రియమిత్రమువలె హితముంబోధించి శాస్త్రము మొదటినుంచియు అలవాటుబడియున్న కర్మలనే ఆచరింపజేయుచుండ

చిత్తము మరెక్కడికినింబోక పరమేశ్వర ప్రీతిఫలక కర్మాచరణమునం
దే నియతముగ నిల్చును. యిట్టి చిత్తనైయత్యమునకే చిత్తశుద్ధియని
పేరు దీనినే భక్తియొక్క ప్రథమాంశమనికూడ జెప్పవచ్చును. గనుక
ప్రతిపురుషునికిన్ని పరమేశ్వర ప్రీతి ఫలక యథాశక్తి విహితకర్మాను
ష్ఠానము సంసారోద్ధరణోపాయములలో ప్రథమోపాయమని పెద్దలు
జెప్పుచున్నారు. ఇంతకు భిన్నమైన కర్మానుష్ఠానము బంధజనకమని
గూడ జెప్పెదరు. యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః-
అని గీతాతృతీయములోని భగవదుపదేశము దీనికి అర్థము. యజ్ఞోవై
విష్ణుః- అని శ్రుతికలదు గనుగ యజ్ఞార్థాత్ విష్ణుప్రకారకమైన కర్మణః
కర్మకంటే అన్యత్ర మరియొకదానియందు అయంలోకః యిక్కర్మాధి
కారి పురుషుడు కర్మబంధనః కర్మయను అంటుడుగలవాడు అనగా పర
మేశ్వరార్థమైన కర్మగాక నాత్మభోగార్థమైన కర్మయంతయు నీకర్తకు



సంసారములో నంటుడు (సంబంధమును) కలుగజేయునదియే. యీశ్వ
రార్థమైనదో సంసారమునుంచి నివృత్తిజేయునది. అని తాత్పర్యము-
అయితే నిత్యములైన సంధ్యావందనాగ్నిహోత్రాది కర్మలు ప్రత్య
వాయపరిహారార్థముగ ననుష్ఠించవలసినదియే. వాటివాటి నిమిత్తము
లు కలిగినప్పుడు తదర్థముగ నైమిత్తిక కర్మానుష్ఠానముంగూడ జేయ
తగినదియే గనుక నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానముంగూడ ప్రతిబంధ
పరిహారద్వారా నిరభిసంధి కర్మానుష్ఠానమువలెనే ఆనుషంగికముగ
వీనికిం బరమేశ్వరప్రీణనమందు ఉపకరించునని చెప్పతగియున్నది. మొ
త్తముకు శాస్త్రీయ కర్మలన్నియు నీశ్వరార్థములేగాని ఆత్మార్థములు
కావని శాస్త్రముయొక్క పరమతాత్పర్యమని తెలియతగియున్నది.
యిట్టి కర్మలం జేయుచు నీశ్వరానుగ్రహమునకు పాత్రులగుచు కృతార్థు
లగువారు కొందరు. గనుక నిది ప్రథమోపాయమని జెప్పియుంటిమి.

యింక భక్తి రెండవ ఉపాయము. (అనగా పూర్వోక్త త్రితయములో మధ్యమ సాధనమనుట) భక్తియనభజసేవాయాం అని జెప్పియున్నందున సేవ అని అర్థము. అనగా ప్రకృతమందు పరమేశ్వరుని ఉద్దేశించి చేయు సేవకు భక్తి అనిపేరు. అది దైహికి మానసి అని రెండువిధములుగలదిగ విభజింపబడియున్నది. ఈరెండింటిని కలిపి మరికొందరు బాహ్యభక్తి- అనన్యభక్తి- ఏకాంతభక్తి- అని త్రివిధముగగూడ జెప్పెదరు. శ్రీభాగవత సప్తమములో ప్రహ్లాద చరిత్రములోని యీ ముందు జెప్పబోవు ప్రహ్లాదోక్తి యిట్టిభక్తిని దెలియపర్చుచున్నది.

శ్రవణంకీర్తనం విష్ణోస్స్మరణం పాదసేవనం
అర్చనంవందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం
ఇతిపుంసార్పితా విష్ణౌభక్తిశ్చేన్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధాతన్మన్యేధీతముత్తమం



యీశ్లోకములు హిరణ్యకశిపు ప్రహ్లాదుని గురించి మీగురువుల వద్ద సద్విద్య నభ్యసించితివా, వింటాము చదువుము. అని జేసినప్రశ్నమునకు విష్ణుకథాశ్రవణాది నవవిధభక్తిస్వరూప ప్రకాశకవిద్యయే సద్విద్య తదధ్యయనమే సద్విద్యాధ్యయనముగాని వేరువిద్యలు సద్విద్యలుకావు. వాటిచదువుట సద్విద్యాధ్యయనమనియు జెప్పంబడదు. యిప్పుడీగురువులు అట్టి సద్విద్యలను నాచే జదివించినవారుకారు. అని చెప్పిన ప్రహ్లాద ప్రతివచన సందర్భములోనివి వ్రాయబడియున్నవి. భగవత్కథాశ్రవణము- భగవత్కథా సంకీర్తనము- బాహ్యభక్తి ప్రకాశకములని జెప్పంబడు బాహ్యభక్తియన శరీరేంద్రియములతో జేయు భగవత్సేవ- భగవత్స్మరణము అనన్యభక్తిని ఏకాంతభక్తినిన్ని సూచించుచున్నది. అనన్యభక్తియన యెట్టిమనోవృత్తిలో భగవదన్య విషయము జేరకుండునో అదియని చెప్పుదురు.

భక్త్యాత్వనన్యయాశక్య అహమేవంవిధోర్జున
జ్ఞాతుంద్రష్టుంచ తత్త్వేనప్రవేష్టుంచపరంతప

అని ఏకాదశాధ్యాయములో నర్జునునికి భగవంతుడుపదేశించి యున్నాడు ఏతాదృశవిశ్వరూపుడనైన నేను అనన్యభక్తిచేతనే శాస్త్రములచే తెలిసికొనుటకొరకున్నూ స్వరూపముచే జూచేకొరకున్నూ చేరుటకొరకున్నూ యోగ్యుడనని తాత్పర్యము. యిక్కడ—

సర్వైరపికరణైర్వాసుదేవా దన్యన్నోపలభ్యతే
యయాసా అనన్యాభక్తిః

అని భగవత్పాదభాష్యము. యెట్టిచిత్తవృత్తి కలిగియుండగా సర్వేంద్రియములచే భగవద్భిన్నవిషయము తెలియబడదో అట్టి చిత్తవృత్తి అనన్యభక్తి అని తాత్పర్యము. అనగా- యీశ్లోకములో అనన్యయాభక్త్యాజ్ఞాతుం- తత్త్వేనద్రష్టుం ప్రవేష్టుంచశక్యః- అని వున్నది



గనుక అనన్యభక్తి త్రితయ నిర్వాహణసమర్థమని చెప్పందగు అట్టి త్రితయమెద్దియన- పరోక్షజ్ఞానము అపరోక్షజ్ఞానము తత్ప్రవేశము అనగా తాదాత్మ్యమున్నూ- యిందు పరోక్షజ్ఞానమనగా ఆచార్యసన్నిధిలో శాస్త్రములంజక్కగా చదివి వాటి అర్థముందెలిసికొని శాస్త్రములయందీశ్వర స్వరూపమెట్లు జెప్పియున్నదో ఆచార్యులెట్లు వివరించిరో అట్లే సర్వదాచింతించుట. అపరోక్షజ్ఞానమనగా సంతతచింతితేశ్వరాకారము విద్యారూపమగు పూర్వోక్తాగమాచార్యోపదేశ సంశుద్ధచిత్తవృత్తియందు సంక్రమించుట- తాదాత్మ్యమన తద్భావము బ్రహ్మాకారతా.

బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి తత్త్వమసి - అయమాత్మాబ్రహ్మ ఇత్యాద్యనేకశ్రుతి సంప్రతిపన్నము- ఏకాంతభక్తియన పూర్వోక్తచిత్తవృత్తి పరమేశ్వరునియందు విలీనమగుట- అయితే పూర్వమందు

జెప్పిన ప్రవేష్టుంచశక్యః అను దానిచేత బ్రహ్మప్రవేశరూప తాదాత్మ్యము ఖ్యాబ్రహ్మవేత్తకు అనన్య భక్త్యధీనముగ నుపదేశింపబడియుండగా ఏకాంతభక్తియను ప్రకారభేదము నెందుకంగీకరించవలెనంటిరేని వాస్తవమే అయితే ఆప్రవేశము నిర్గమానుకూలమను సంశయమున్న యెడల దానికి తాదాత్మ్యమను నర్థము స్థిరపడకుండును. అట్లైన బహు శ్రుతివిరోధము సంభవించును. యిప్పుడో- ఏకాంతభక్తినిగూడ నంగీకరించినయెడల చింతకునితోపాటు స్వయంచిన్మయమగుచు తాదాత్మ్యమును స్థాపించును. యిదియునుంగాక అనన్యభక్తియొక్క నైయత్య లక్షణవిశేషమే ఏకాంతభక్తియనికూడ సంప్రదాయ రహస్య వేత్తలగుపెద్దలుజెప్పెదరు. యిదియునుంగాకభక్తి యెట్టిసంసారోద్ధరణోపాయమో కామాదికదంబమున్నూ అట్టి దృఢతరోపాయముగానే చెప్పతగియున్నది. గోపికాస్త్రీలు భగవంతుని కామించియు నందయశో





దాసులతని ప్రేమించియు చైద్యాదులతని ద్వేషించియు- యాదవులతనికి సంబంధించియు- పాండవులతని మిత్రముగ బరిగ్రహించియు ముక్తిం చెందినట్లు శ్రీభాగవతాది గ్రంథములుపదేశించుచున్నవి. అయితే యిక్కడ స్త్రీలు పతిదేవతలుగానుండక నన్యాసక్తులుగానుండుట శాస్త్రీయము కాదు గనుక యిట్టి ప్రతిషిద్ధ కర్మాచరణమునకు ఫలము దుఃఖమును కలుగజేయతగియుండగా ఫలప్రదాతయగు సర్వేశ్వరుడు శాశ్వతసుఖమును కలిగించుటకు కారణమేమనియు యిట్లే చైద్యాదికృతాత్మద్వేషాదికమునకున్నూ వ్యతిరేకఫలము కలుగతగియుండగా భగవత్తాదాత్మ్యలక్షణమహాఫలమునకున్నూ కారణమేమనియు శంకకలుగవచ్చును. యిక్కడ యిట్లు విచారణీయము మంచిది చైద్యుడతని ద్వేషించియేమిజేసినాడు? నిందించినాడుగదా. యీనిందారూపమగు భగవద్దోషసంకీర్తన మాభగవంతునికి వ్యథాకరము గనుక నితనికి దానిఫలము

దుఃఖము కలుగవలెనా- లేక పరదారగమనాదికమువలె నాశ్లీలంకీర్త
యేత్- ఇత్యాది శాస్త్రప్రతిషిద్ధకర్మాచరణమునుబట్టి దుఃఖముగలుగ
వలెనా- దేహాభిమాన నిమిత్తములగు నిందాస్తవాదులు దేహికి హర్ష
శోకాదిజనకములు గనుక నీశ్వరుడు విదేహుడు గనుక దేహాభిమానమె
లేకుండుటనుబట్టి తన్నిమిత్తకనిందాస్త వాదిజన్యహర్షశోకాదికము
న్నూ అతనికిం గలుగనేరదు. అప్రాణోహ్యమనాశ్శుభ్రః- అశరీరం
వావసంతం నప్రియాప్రియేస్స్పృశతః- అసంగోహ్యయంపురుషః- ఇత్యాది
శ్రుతులు పరమేశ్వరుని అశరీరినిగా జెప్పుచున్నవి. గనుక చైద్యాదికృ
త నిందాదికమీశ్వర వ్యథాకరమని జెప్పందగదు. యింక సర్వదా
నిందించుటయనెడు ప్రతిషిద్ధకర్మాచరణముగదా వీనికి దుఃఖముంగల్గిం
చవలసినది. దోషసంకీర్తన సందర్భములో పలుమారు ముచ్చటించిన
భగవన్నామముయొక్క సత్ఫలము దోషాదిసంకీర్తన దుష్ఫలముకంటె







చాలా పెద్దది గనుక దోషసంకీర్తనాఘమును భగవన్నామోచ్చారణ
సుకృతము నిర్మూలముం జేసి వీనిముక్తునిగ జేయును. యిట్లే గోపికాస్త్రీ
లకు కలిగిన భగవదనురాగ విషయములోగూడ సమాధానమూహింప
తగినది. యిదిగాక యీపతిదేవతలు జగత్పతిదేవతలగుటకంటె మహాభా
గ్యమేమనియు-నిత్యానపాయినియగునమ్మహాలక్ష్మియెప్రకృతకామినీ శ
రీరములయందంతర్హితమైలీలానటనముంజరిపినదనియు జెప్పందగు భగ
వన్నామోచ్చారణ మాహాత్మ్యమును శ్రీభాగవతములోని షష్ఠస్కంధ
ద్వితీయాధ్యాయగతములైన యీక్రింద శ్లోకములను వదించుచున్నవి.

స్తైనస్సురాపోమిత్రధ్రుగ్బ్రహ్మహాగురుతల్పగః
స్త్రీరాజపితృహంతాగోమెచపాతకినోఽపరే॥
సర్వేషామప్యఘవతామిదమేవసు నిష్కృతం
నామవ్యాహరణం విష్ణోర్యత స్తద్విషయామతిః॥

పంచమహాపాతకులుగాని స్త్రీ రాజ పితృహత్యలం జేసినవారుగాని- యింక నితరపాతకములం జేసినవారుగాని యిట్టి పాపిష్ఠులందరికిని విష్ణునామోచ్చారణమే విడుదలచేయునది. (శ్రేష్ఠమైన ప్రాయశ్చిత్తమనుట) వీడు నావాడు గనుక రక్షణీయుడను బుద్ధి విష్ణువునకు యెందువలన కలుగుచున్నదో అందువలన నిదియే ప్రాయశ్చిత్తమని తాత్పర్యము.

సాంకేత్యం పారిహాస్యంవా స్తోభం హేళనమేవవా
వైకుంఠనామగ్రహణ మశేషాఘహరంవిదుః॥

యిదిగాక నాత్మీయులకు చేయబడిన సంకేతముచేగాని పరిహాసముచేగాని వాక్యపూరణము నుద్దేశించిగాని హేళనముచేగాని చేయబడిన భగవన్నామోచ్చారణము సకలపాపక్షయకరమని తెలియుదురని తాత్పర్యము. యిట్లు భాగవత ధర్మతత్వరహస్యవేత్తలగు పెద్దలు జెప్పుచున్నారు. యిదిగాక యీస్కంధములోనే తృతీయాధ్యాయము



లో నాత్మభటులనుగురించి యమవచనము.

స్వయంభూర్నారదశ్శంభుః కుమారః కపిలోమనుః
ప్రహ్లాదోజనకోభీష్మో బలిర్వైయాసకిర్వయం ॥
ద్వాదశామీవిజానీమో ధర్మంభాగవతంభటాః.
గుహ్యంవిశుద్ధందుర్బోధం యజ్ఞాత్వామృతమశ్నుతే ॥

బ్రహ్మదేవుడు, నారదముని, ఈశ్వరుడు, సనత్కుమారుడు, కపిలముని, మను ప్రహ్లాద జనక భీష్ములు, బలిచక్రవర్తి, శ్రీశుకులు, మేము అనగా యముడు, యీపన్నెండుమందిమిన్ని భగవద్ధర్మతత్త్వము నెరిగినవారము. దేనిని దెలసికొని జనుడు మోక్షమునొందునో అట్టి యీభగవద్ధర్మతత్త్వము, రహస్యము, పరిశుద్ధము, సామాన్యముగ తెలియదగినదియు కాదని భావము. ఇదిగాక కొందరుపెద్దలు భక్తిస్తవాదిసాత్త్వికోపాయకదంబము భగవత్ప్రసాద సంపాదనమందు వి

లంబోపాయమనియు ద్వేషాదికమూవిషయమై యవిలంబోపాయమని యుం జెప్పుచు తదుపబృంహణముగ శ్రీభాగవత సప్తమప్రథమాధ్యాయములో నీదిగువ వ్రాయబడినదాని నుదాహరించెదరు.

యథావైరానుబంధేన మర్త్యస్తన్మయతామియాత్
నతథాభక్తియోగేన ఇతిమేనిశ్చితామతిరిత్యాది ॥

దీనిని భగవత్ప్రసాదసంపాదనమందు వైరమున్నూ ప్రశస్తమేనని నహినిందాన్యాయానుసారముగ పక్షాంతరముచే వైరప్రాశస్త్యప్రశంసాధకమైన అర్థవాదమని శాస్త్రజ్ఞులు సమర్థించెదరు. ఇదిగాక శ్రవణంకీర్తనం - ఇత్యాది పూర్వోదాహృతశ్లోకములో పాదసేవనార్చనాది పదములు పరవ్యూహవిభవాది భగవద్విభూతి అతీంద్రియము గనుక కల్పితబాహ్యభగవద్విగ్రహారాధనమును సూచించుచున్నవి. ఇందుచే విగ్రహారాధనము కూడదనువాదము భగవత్ప్రసాద సంపాదక



సామగ్రీసాకల్యము కలదికాదని చెప్పతగియున్నది. ఇదిగాక వారున్ను భగవంతునికి జ్ఞాపకములుగా నెంచబడుచున్న ప్రతిమాది బాహ్యస్థూలాకారములను నిషేధించిరేగాని మానసికసూక్ష్మాకారముల నంగీకరించియే యున్నారు. వారికిని మనకున్ను జ్ఞాపకస్థూలసూక్ష్మాకారములలో నభిప్రాయభేదము తప్ప కల్పితభగవదాకారములో సంప్రతిపత్తియేగదా. అయితే మనవాదము, ఓమితిబ్రహ్మ, ఆదిత్యోబ్రహ్మేత్యాదేశః - ఇత్యాది సకలశ్రుతిసంప్రతిపన్నము గనుక సప్రమాణము. వారివాదమో కేవల పురుషబుద్ధి కల్పితము గనుక యిట్టిదికాదనిమాత్రం చెప్పశక్యమగునుదు. గనుక కల్పితబాహ్యభగవద్విగ్రహాకారముకూడా పాదసేవనార్చనాదిద్వారా భక్తునికి భగవదనుగ్రహాధాయకములగు నుపాయములలో నొకయుపాయముగా జేరియున్నదనుటకు నెంతయు, సందియము లేదు. ఈలోగడ చెప్పిన సంగతులచే భగవదనుగ్రహసంపా

దనమునకు భక్తి అవ్యభిచారిసాధనమని తెలినదికదా. అట్టిభక్తిని శ్రుతిస్మృతిబ్రహ్మసూత్ర తద్భాష్యాది గ్రంథములన్నియు స్పష్టముగ కనుపరచుచున్నవి.

ధనుర్గృహీత్వౌపనిషదం మహాంతంశరంహ్యు
పాసానిశితంసంధీయత ఆయమ్యతద్భాగవ
తేనచేతసాలక్ష్యం తదేవాక్షరం సౌమ్యవిద్ధి
తత స్తుతంపశ్యతే నిష్కళంధ్యాయమానః ॥

అనియు ముండకశ్రుతి యున్నది. ఇక్కడ ఉపాసానిశితం, -సంతతాభిధ్యానేన తనూకృతం అనియు, ధ్యాయమానః - చింతయన్నయంపశ్యతి, అనియు భగవత్పాదభాష్యము ఉపనిషత్ప్రసిద్ధమైన మహాస్త్రమును గ్రహించి దానియందు ఉపాసనముచే తీక్ష్ణమైన బాణమును సంధించవలెను. సంధించి, భగవద్గతచిత్తముతో నాకర్షించి అక్షర



లక్షణభగవదాకారమును లక్ష్యమునుగా దెలిసికొనుమనియు, ధ్యానము జేయువాడు నిష్కళపరబ్రహ్మమును జూచుననియు తాత్పర్యము. ఇదిగాక

యస్యదేవేపరాభక్తి ర్యథాదేవేతథాగురౌ
తస్యైతేకథితాహ్యర్థాః ప్రకాశంతేమహాత్మనః ॥

అని శ్వేతాశ్వతరశ్రుతి. ఎవనికి దేవునియం దుత్కృష్టమైన భక్తికలదో, అట్లే గురువులయందును కలదో, అట్టిమహానుభావునికి యీశ్రుతియందు జెప్పబడిన అర్థములు స్ఫురించునని అంతమందుజెప్పి యుపసంహరింపబడినది. ఇక్కడ పరా, ఉత్కృష్టా, నిరుపచరితా, భక్తిః అని భగవత్పాదభాష్యము - భక్తిః, ఆస్తిక్యబుద్ధ్యాదియుక్తా భజనక్రియా - కాయేంద్రియమనసాం - తస్మిన్ సమర్పణమిత్యర్థః - అని శంకరానందస్వామి వివరణము - భక్త్యాయుక్తోయోగ బలేనచైవ -

అను గీతాశ్లోకముకు - భజనంభక్తి స్తయా - అనిభాష్యము - భక్త్యా త్వనన్యయాశక్యః - ఇత్యాది గీతావచనము లిదివరకే కనుపరచబడి యున్నవి. ఇంక బ్రహ్మసూత్రములు తృతీయాధ్యాయ ద్వితీయపాదములో —

అపిసంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం

అను సూత్రముకు శ్రుతిస్మృతిపురాణములచే మహాయోగులా పరమాత్మను సంరాధనకాలమందు జూచుచున్నారని జెప్పెదమని తాత్పర్యము. సంరాధనం - భక్తిధ్యానప్రణిధానా ద్యనుష్ఠానం - అని భగవత్పాదభాష్యము - సంరాధనమనగా భగవంతుని భక్తిధ్యానములచే జక్కగ నిలుపుకొనుట. అని భాష్యార్థము ఇదిగాక ద్వితీయాధ్యాయ ద్వితీయపాదములో పాంచరాత్రమతశోధనములో

ఉత్పత్త్యసంభవాత్



యీసూత్రవివరణములో - యదపితస్యభగవతః అభిగమనాది లక్షణమారాధనం తదపి నప్రతిషిధ్యతే - శ్రుతిస్మృత్యోరీశ్వరప్రణిధానస్య ప్రసిద్ధత్వాత్ - అని భాష్యము - ఈశ్వరుని భక్తిధ్యానములచే మనసులో నిలుపవలసినట్లు శ్రుతిస్మృతులయందు ప్రసిద్ధము గనుక భగవదాకారముకు జ్ఞాపకమైన ప్రతినిధివిగ్రహము నెదుర్కొని సందర్శించుట మొదలగు నారాధనమున్నూ మాచే నిషేధింపబడదని భాష్యతాత్పర్యము. ఇత్యాది భాష్యగ్రంథము భాష్యకారులకు భక్తిభావమును జెప్పుచున్నదిగదా - ఇదిగాక ప్రథమాధ్యాయములో - అథాతో బ్రహ్మజిజ్ఞాసా - అను సూత్రములోనుండు బ్రహ్మశబ్దముకు -

అస్తితావన్నిత్యశుద్ధ బుద్ధముక్తస్వభావం సర్వజ్ఞం
సర్వశక్తి సమన్వితం బ్రహ్మ -

అని నిర్విశేష సవిశేషపరముగా నర్థమును జెప్పియున్నారు. ఆనం

దమయాధికరణములో - ద్విరూపంహి బ్రహ్మావగమ్యతే - అనియు జె
ప్పియున్నారు. అంత స్తద్ధర్మోపదేశాత్ - దీని వివరణములో - స్యా
త్పరమేశ్వరస్యాపి ఇచ్ఛావశాన్మాయామయం రూపం సాధకానుగ్ర
హార్థం - అనిన్ని వ్రాసియున్నారు. ఇట్లే భాష్యములో నక్కడక్క
డ భగవద్భాష్యకారులు సగుణబ్రహ్మనున్ను తద్విషయమైన భక్తి
ధ్యానాదులనున్నూ స్పష్టముగ సప్రమాణముగ గనుపరచియుండగా
కొందరాధునికాభినవబ్రహ్మ విద్వదంతేవాసులు భాష్యకారులు స
గుణబ్రహ్మనే వొప్పుకొనలేదు భక్తిని అంగీకరించనేలేదు. వారు కేవల
నిర్విశేషవాదులే. గనుక ప్రచ్ఛన్నబౌద్ధులని ఇతరవిద్వాంసులచే పరి
హసింపబడిరి. వారిసిద్ధాంతము న్యాయ్యముకాదని యేమియేమి నిందా
వచనముల నుదహరించిరో వారలు భాష్యార్థము తెలియని వారలన
వలెనా - అనాద్యవిద్యాదోషదూషితాంతఃకరణవృత్తి కలవారనవ



లెనా విద్వాంసులే వివరించెదరుగాక. గనుక అన్ని మతములవారికిన్ని
స్వస్వాభిప్రేతముగానుండు సిద్ధాంతములో నీపత్ర్ప కారభేదముకనుపడిన
ను భక్తిపరమోపాయమనే అంశములో నందరికిని ఐకమత్యముకలదు.
అందులో భగవత్పాదభాష్యప్రస్థానము అతిప్రౌఢముగనుక నందలివిష
యము సాంప్రదాయిక విద్వచ్చరణసేవయు - భగవద్భక్తివైభవము
న్నూ లేక నాత్మమతివైభవముచే దుర్బోధము - గనుక పైన కనుపర
చబడిన నిందకులు భగవత్పాదభాష్యార్థ పర్యాలోచనముం జేసి
ప్రాచీనాభిప్రాయమును దొలగించుకొందురుగాత,
గనుక యిప్పుడు భక్తి మొదలయిన యథాశక్తిప్రధానోపాయ
సంపాదనముంజేసికొని సజ్జనసేవచే కృతార్థులగుటకు ప్రయత్నించు
చుండవలెనని వేడుకొనుచున్నాను.

బం॥ గురుమూర్తిశాస్త్రి. తెనాలి.

